# గోలకొండపత్రిక

విక్రమనామసంవత్సర భాద్రపద శు॥ ౧౧
గురువారము


## ఉస్మానియా విద్యార్థుల చర్యలు.

నవంబరు ౧౯౩౮ ఉస్మానియా విద్యాపీఠ కళాశాలావిద్యార్థులు చేసిన చర్యలను గురించి ప్రభుత్వ ప్రకటన వెలువడి ౧౦ దినము లయ్యెను. ఈ చర్యలను గురించి స్థానిక వ్యక్తులు కొందరును పత్రికాధిపతులును తమకు తోచిన అభిప్రాయములను వెల్లడించినారు. విద్యార్థులు సగముపిచ్చివారని ఒకరన్నారు. బహుశా ఈ వాదాలో ౘాలకొంత ఆధారముండవచ్చును. నిజాము రాష్ట్ర మునకు బయటి ముచ్చట వదలిపెట్టి మనరాష్ట్రములోనే సగంపిచ్చి పనులను కొందరు విద్యార్థులు చేసియుండిరి. "వందేమాతరం" గానమునుగురించి కొందరు విద్యార్థులు పిచ్చిపట్టుదల కలవారై ౧౦ కుటకు నాగపూరునకు పోయి వచ్చిరి. ౙకీనగరులో ఒక విద్యార్థి సగంపిచ్చిపని చేసినందున ఇంకను విచారింపబడుచున్నాడు. మహబూబునగరంలో ఒక విద్యార్థి ఏవో పిచ్చి గీతలు బోర్డుపైగీసి శిక్షను ఏదోవిధంగా అనుభవించినాడు. ఇప్పుడు మరీ శ్రుతిమించిన పిచ్చిలో యీ ఉస్మానియా కళాశాలా విద్యార్థులు పడిపోవుట చాల విచారకరము

విద్యార్థులు ప్రభుత్వమువారి పిల్లలనిన్ని వారిచర్యలను క్షమించవలెనని న్ని కొన్ని పత్రికలు వ్రాసినవి. ఖానూను ప్రకారము ౧౮ వండ్లలోపలి పిల్లలకు ఒక విధమగు పరిపూర్ణ లేక పాఠ్యశాలలలోనుంచుటమనము చూచుచేయున్నాము. ౧౮ పండ్లకు మించిన వయస్సుకలవారును, 'ఉత్తమకళాశాలలో ఉన్నతమవిద్యను పఠిస్తు అనుపనితో శాస్త్రముతోసహా చదువు పిల్లలుకూడ దౌర్జన్యములు చేసినారంటే ఏమిచెప్పుటకును మాకు కలమాడదు. పూర్వము హాజరత్ ఉమర్ ఖలీఫాగారు చేసిన యొక న్యాయము మాకు జ్ఞాపకము వచ్చుచున్నది. హాజరత్ ఉమర్ గారి కుమారుడే వ్యభిచారముచేసెనని వారి వద్ద మొరపెట్టుకొనగా షరేయతీఫ్ ప్రకారము అతనికి కొరడాదెబ్బలశిక్ష యిప్పించిరి. దెబ్బలలెక్క పూర్తికాకముందే కుమారుడు చనిపోయెను అప్పుడు న్యాయలోపము కాకుండా హాజరత్ గారే స్వయముగా కొరడాతీసుకొని మిగతదెబ్బలను శవముపై తగిలించినారు. అయితే అట్టిన్యాయమే మన విద్యార్థులకు వర్తించవలెనని మేము చెప్పము. వారు సర్కారు పిల్లలను ఉపమానముమాత్రము అప్రస్తుతమని చూపించుటకై. మేమీ చారిత్రిక న్యాయపద్ధతిని నిరూపించవలసి వచ్చినది

విద్యార్థులది తప్పా, పై ఠ్వేవారిదితప్పా, పీరిరువురిమధ్య వచ్చిన పోలీసువారిదితప్పా, అనే అంశమును కమిటీవారు విచారించనున్నారు. కావున మేము దానిపై అభిప్రాయమీయజాలము కాని ఒక పత్రికలో అటుపోయి యిటుపోయి పట్టురా, పేదబాపనయ్యను అన్నట్లు పై మూడువర్గాలను వదలి ఉస్మానియా ప్రొఫెసర్లను విచారించి వారికి తగిన ప్రాయశ్చిత్తము చేయవలెనని, వ్రాసినది మాకాశ్చర్యము కలిగించినది.

ఇదియిట్లుండగా కళాశాలను అజ్ఞాంతరమువరకు (తాహుకుమెసాని) మూసివేయుట మాత్రము మాకు చాలావిచారము కలిగించుచున్నది. పాపము విద్యార్థులకు విద్యానష్టి కలుగుచున్నది. పీలైతే ఇక్కడను కళాశాలను తెరపించి విద్యను ఎప్పటివలె సాగించవలెనని కోరుచున్నాము. మరల ఏమైనా అల్లరిచేసిరా చేసిన వారిని మాత్రము కళాశాలనుండి బయటికి పంపవచ్చును. తక్కిన వారికి విద్యసాగించుకొనుఅవకాశమియ్యవలెను.

ప్రభుత్వమువారు ఈ అల్లరును, గురించి విచారణచేయుటకు ఒకకమిటిని ఏర్పాటుచేసినందులకు "ఇదిచాలాగొప్ప విషయము. అపూర్వమైన సంగతి" అని ముషీరేదక్కన్ వారు వ్రాసినారు. మరియు నిట్లని అభిప్రాయమిచ్చినారు. "ఇదివరలో ప్రజావిద్యామహాసభవారు హృదయనాథ కుంజ్రూగారి అధ్యక్షతలో సభచేసిననాడు విద్యాభివృద్ధికవసరమగు విధాన మాలోచించుటకు కమిటీ యేర్పాటుచేయవలె నని కోరియుండిరి. హైదరాబాదులో హిందూముసల్మాను అల్లర్లయి జరిగినప్పుడున్ను, బిదరులో అగ్నికాండ జరిగినప్పుడున్నూ ప్రజలు కమిటీ విచారణకావించవలెనని కోరిరి. కాని అప్పుడట్లు చేయలేదు. ఇప్పుడుచేసినారు. ఇదిచాల ప్రోత్సాహకరవిషయము. ఇది ఒకవిధముగా చారిత్రిక కాంశము అని అనవలెను. కొత్తయుగము మొదలైనట్లు ప్రారంభలక్షణమనియన్ను అనుకొనవలెను" అని అభిప్రాయమిచ్చినారు.

ఎట్లైతేనేమి కమిటీ ఏర్పడింది. అయితే కమిటీలోని సభ్యులు ఉస్మానియా ప్రాతవిద్యార్థి సంఘము వారికి నచ్చినవారో కారో. ఎందుకనగా తమ మహాసభలో తమకు విశ్వాసముకల సభ్యులను అనధికారసభ్యులను కూడా ఏర్పాటు చేయవలెనని ప్రాతవిద్యార్థులు తీర్మానించియుండిరి. ఈప్రాత విద్యార్థులింకొక విచిత్రతీర్మానంకూడా చేసియుండిరి. ప్రభుత్వ ప్రకటన మూర్ఖకొలది తప్పులతో కూడినదనియు, తర్కానికందనట్టి పరస్పర విరుద్ధమగు సంశయములతో కూడినదనియు, దానిని ఉపసంహరించుకొనవలెననియు తీర్మానించిరి. ఇది సాహసయుక్తమైన తీర్మానము. ప్రభుత్వమువారు దానినిగురించి ఏమి చర్య తీసుకొందురో తెలియలేదు.

విద్యార్థుల అల్లరిమూలాన దెబ్బలుతగిలిన పోలీసు, రైల్వే ఉద్యోగులకును, విద్యార్థులకును మా హృదయపూర్వకమగు సానుభూతిని తెలుపుకొనుచున్నాము. ముత్తముపై న్యాయశాస్త్రప్రకారము కమిటీవారు తమ నిర్ణయమును వెల్లడింతురని దేశీయులంతప ఎదురు చూచుచున్నారు.

## జపాను ప్రతిఘటనకై రష్యాతో అమెరికా రాయబారము

( ౧౦ వ పేజీ తరువాయి )

### జపాను దేశీయాంగ వ్యవహారము

జపాను నౌకా శాఖమంత్రియగు అడ్మిరల్ యోషిదాగారు జబ్బుగానుండుటచే రాజీనామానిచ్చిరి. వారిస్థానములో పెరకోసురావద్ద నౌకా స్థావరముయొక్క అధికారియగు అడ్మిరల్ హోషిరో ఒయికావా గారు నియోజించబడిరి. సెప్టంబరు ౬వ తేదినాడు జపాను ప్రధానమంత్రిగారు యుద్ధమంత్రి, నౌకామంత్రి విదేశాంగమంత్రులలో రక్షిణములో జపానువిధానమును గూర్చిఆలోచించిరి. అనలుగురుమంత్రులును ఇండోచైనాలో జపానుసేనలు ప్రవేశించరాదని ఇతర దేశముల ప్రభుత్వములుగావించిన ప్రార్థనను కఠినముగా నిర్లక్ష్యముచేయుటకుతీర్మానించుకొనిరి.

### రష్యాతో అమెరికా ఎత్తు

వషింగ్టను. ఆమెరికాలో అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమువారు రష్యా రాయబారితో ఇండోచైనాలో జపాను ఆక్రమణ యత్నమును అరకట్టువిషయమై రాయబారములు జరుపుచున్నారు. ఇదేప్రయోజనమునకై బ్రిటిషువారినుండి సింగపూరులో నౌకా, విమానాశ్రయములను పొందువిషయముగూడ అమెరికా ప్రభుత్వమువారు బ్రిటిషురాయబారితోను, ఆస్ట్రేలియా రాయబారితోను సంభాషించుచున్నట్లు కనపడుచున్నది.

అమెరికా ప్రభుత్వమువారు, కెనడావారితోను, ఆస్ట్రేలియా వారితోను, న్యూజీలెండువారితోను ఒకరినొకరు కనిపెట్టి మెలగుచుండగలమను ఒడంబడికలపై సంతకములు సెప్టంబరు ౭వ తేది అమెరికాలో పెట్టబడినవి.

## మైసూరు మహారాజుగారి పట్టాభిషేకము

మైసూరు యొక్క క్రొత్త మహారాజుగారి పట్టాభిషేకమహోత్సవక్రియాకలాపములు వైదిక రీత్యా సెప్టంబరు ౭వ తేది ఉదయము ప్రారంభమయ్యెను. మహారాజుగారు సెప్టంబరు ౮వ తేది సింహాసనమున గ్రహించిరి. ఈసందర్భమున మహారాజుగారు ప్రజలకిచ్చినసందేశములో తాను తనతండ్రిగారివలెనె న్యాయపాలనచే ప్రజాభిమానమునకై కృషిచేయగలమని చెప్పిరి.

## గోలకొండ డైరీ

౫౬ దినాలలో ౫౦౦ ఖర్చైపోయినవి

మా డైరీనిగురించి మెచ్చుకొన్నవారే కాని తప్పుపట్టినవారొకరున్నూ కానరాలేరు. మాకువచ్చిన అభిప్రాయాలలో రెండు జాబులలోని వార్తలను ఉన్నవున్నట్లుగా ఈక్రింద నుదహరించుచున్నాము.

"అయ్యా,
నామిత్రులగు సి. మాణిక రెడ్డి నిజామాబాదు గారిఉన్న తమడైరీ చాలాబాగా ఉన్నది అని చెప్పుటలో ఆర్డరుపంపినాము. దయచేసి కార్డుముట్టినవెంటనే పూర్తిచర్మముది వీ. పీ. ద్వారా పంప ప్రార్థించుచున్నాము.
ఇట్లు సి. గంగారెడ్డి. వర్నాపల్లి
బోధన్ టప్పా— ,

పాస్టర్ జే.జీవరత్నంగారు. సర్జ్ఞనుండి ఇట్లు ౨౯-౧౧-౪౦నాడు వ్రాసినారు.
"తమరు మిక్కిలి శ్రద్ధతో తయారుచేయించిన డైరీల విషయం మేము చాల సంతోషించుచున్నాము. దయచేసి నాకొరకు ఆరు (౬) డైరీలు వీ. పీ, గా పంపగలరు"

ముషీరేదక్కన్ వారు ౭ సెప్టెంబరునాటి పత్రికలో మా డైరీని గురించి పూర్తిగా ఒకకాలం పొడవున మెచ్చుకొని తమ అభిప్రాయాన్ని ప్రసాదించినారు. అందులోని కొన్ని వాక్యాలను మాత్రమే ఉదహరించుచున్నాము.

"ఇందులోని విషయాలు అమూల్యమైన రత్నాల గని అని చెప్పవచ్చును. తెనుగువారు దీనినుండి తప్పకుండా లాభము పొందగలరని అనుకుంటాము. ఈవిధమైన మొట్టమొదటి ప్రయత్నం స్థానికపత్రికా సంపాదకులు చేసినారు, దీనిని గౌరవదృష్టితో చూడవలెను. .. ... ... ... "

డైరీవెల చందాదారులకు క్యాలికో బైండుది
౧౨ అణాలు మాత్రమే-
చర్మపువీపు మూలలు గలది- రు ౧. పూర్తిచర్మముది రు ౨.
చర్మముది ఆర్డరుపైననే తయారు చేయబడును-
ఇతరులకు ౨ అణాలు ఎక్కువ.

మేనేజరు గోలకొండపత్రిక.
హైదరాబాదు-దక్కన్ అనివ్రాసి తెప్పించుకోగలరు.

## బ్రిటిషు జర్మను విమానాల దాడులు

సెప్టంబరు ౩వతేదినుండి ౯వతేదివరకు వచ్చిన వార్తలను చూడగా బ్రిటనుపై జర్మనీ విమానదాడుల తీవ్రత అతివేగముగా హెచ్చినట్లు కనిపించగలదు. ప్రతిరోజు ఉదయము, మధ్యాహ్నము సాయంకాలము, రాత్రి, అర్ధరాత్రివేళలలో జర్మనువిమానాలు ఇంగ్లాండు, వేల్సు, స్కాట్లెండులో అనేకపట్టణములపైననేగాక పల్లెప్రాంతములపైగూడ తిరిగి బాంబులువేసినవి విమానముల సంఖ్య ఒక్కసారిదాడిలో మొదట మొదట ౧౦౦ నుండి ౫౦౦వరకు హెచ్చినది- బాంబులవల్లకలిగిననష్టముల పరిమితికూడ తుదిరోజులలో చాలదూరము హెచ్చినది. బాంబులవల్లకలిగిన నష్టముల పరిమితికూడ తుదిరోజులలో చాల దూరము హెచ్చినది. బ్రిటిషువారు సైనికస్థలములకు ఉపద్రవము కలిగినట్లు అంగీకరించుటలేదుగాని, పారిశ్రామిక యంత్రాలయములకును, ఇండ్లకును, జనులకును గొప్పదెబ్బతే తగిలినట్లుఅంగీకరించుచున్నారు.

ప్రతిరోజును లండనునగరముపై అయిదారేడుసారులుకూడ దాడులుజరిగినవి. సెప్టంబరు౭వ తేదిరాత్రి సాయంకాలము మొదలుకొని మరల తెల్లవారువరకుకూడ దెబ్బతీయబడెను, లండనునగర మధ్యములో బాంబులువేయబడెను. అనేక ప్రభుత్వకార్యాలయములకు దెబ్బలు తగిలెను, రోగ్సులో గండిపడెను. పార్లమెంటుభవనములపై బ్రిటిషుజర్మను విమానాలకు గొప్పపోరాటముజరిగెను. దాడిలో నిజముగా గొప్పనష్టము జరిగెనని బ్రిటిషువారు ఒప్పుకొనుచున్నారు.

సెప్టంబరు ౫వతేది ఉదయందాడిలో వేల్సులో ఒకచోట ఏకా తెల్లని పొడిపేయబడెను. ఆనాటి అర్ధరాత్రి లండనులో "మాలొటోవు రొట్టెబుట్ట బాంబు"లనబడునవి వేయబడెను. ఇది ఒక్కొక్క బుట్టలో అనేకములైన బాంబులుండి ఒకదానివెంట ఒకటి ప్రేలబడెను. ఉభయ విమానాల లెక్కలు క్రిందివిధముగా ఉన్నవి.-

| తేది | | జర్మని | బ్రిటిషు |
|---|---|---|---|
| సెప్టంబరు | 3 | ౨౫ | ౧౫ |
| ,, | ౪ | ౬౦ | ... |
| ,, | ౫ | ౩౯ | ౨౦ |
| ,, | ౬ | ౪౫ | ౧౯ |
| ,, | ౭ | ౭౫ | ౧౮ |

## కాంగ్రెసు కోరిక నిరాకరణము

సెప్టంబరు ౫౯వతేదినాడు బ్రిటిషు పార్లమెంటు కామన్సు సభలో ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేట్ గారిని కాంగ్రెసు ముఖ్యమైనదైనందున దానికోరికలను గూర్చి పునర్విచారణచేసెదరా యనిఅడుగగా, అందుకు సమాధానముగా "లేదు" అనిచెప్పిరి.

## ఆంధ్రోద్యమ ప్రచారములు

(౫వ పేజీ తరువాయి)

మహాసభాధ్యక్షులును ఆంధ్రోద్యమచరిత్రనువివరముగా తెలియజేయుచు భవిష్యత్తు నిర్మాణకార్యక్రమముజరుపుటకు ప్రబోధించిరి. తాలూకాసంఘముస్థాపింపబడి వెంటనే క్రిందియెన్నికలు జరిగెను —

అధ్యక్షులు శ్రీయుత వేములపల్లి వెంకట క్రిష్ణయ్యగారు,
ఉపాధ్యక్షులు ,, కోదాటి వెంకటేశ్వర రావుగారు,
కార్యదర్శులు. { శ్రీయుత చకిలం వెంకట రంగారావు, శ్రీయుత వేముల పల్లి భాస్కరరావుగార్లు,
కోశాధిపతి గవ్వా అమృతరెడ్డిగారు

వీరుకాక సభ్యులు (౫)రు ఎన్నుకొనబడిరి గ్రంథాలయము అభివృద్ధిని ప్రశంసించుచు త్వరలో వార్షికోత్సవము జరుపుటకుసూచించిరి. అక్కడినుండి సాయంత్రంబయలుదేరి జగ్గాము కోడ్డుమధ్యనున్న మొండ్రాయి గ్రామములోని మిల్లుఅరుగలో రాత్రివిశ్రాంతికైనిలచిరి

### కాటిపాములపట్టీ సంఘస్థాపన

౨౬-౧౧-౪౯ ఉదయము మొండ్రాయినుంచి బయలుదేరి కాటిపాముల ప్రవేశించిరి పదిహేను గ్రామాములకు గాను ఒకపట్టిసంఘము ఏర్పడి క్రింది యెన్నికలు జరుపబడెను

అధ్యక్షుడు శ్రీ కె. కోదండరామరెడ్డిగారు,
ఉపాధ్యక్షులు శ్రీ ప రాధాకిషన్‌రావుగారు,
కార్యదర్శులు. శ్రీ బి. రామరెడ్డి, కె. ప్రతాపరెడ్డి గార్లు

### జనగాము తాలూకా సంఘము

వారుకుల ఒంటిగంటకు బయలుదేరి జనగాము ప్రవేశించిరి అచ్చట స్థానికముఖ్యులు సమావేశమయి ఇష్టాగోష్ఠిగచర్చింపబడెను. తాల్కాలిక తాలూకా సంఘస్థాపనకై స్థానికుల పరస్పరసంప్రదింపులతో కార్యనిర్వాహకవర్గము నిర్ణయింపబడెను.

అధ్యక్షులు. శ్రీ. చొల్లేటి రామిరెడ్డిగారు,
ఉపాధ్యక్షులు, శ్రీ. నెల్లుట్ల నృసింహరావుగారు.
కార్యదర్శులు. శ్రీ దిమట్టపల్లి నర్సింసింహరావు,
శ్రీ అత్మారాం గార్లు

వీరికి (౫) సలహాసభ్యులుగా నియమింపబడిరి, స్థానికగ్రంథాలయము ఆంధ్రభాషాభివర్ధని ఒకానొకప్పుడు మంచి అభివృద్ధిదశలోనుండి ఇపుడుజీర్ణించిపోయినందున దానిని పునరుద్ధరించుటకై గ్రంథాలయముతో సంబంధమున్న ప్రముఖులనుకోరిరి దీనికొరకు వార్షికోత్సవము జరుప్రట అవసరమనితలచి, ౨౨ అబాన్ తేది వార్షికోత్సవమునకునిర్ణయింపబడెను.

### కొలనుపాక సన్మానము

సాయంత్రము (౫) గంటలకు జగ్గామునుండి బయలుదేరి, మహాసభాధ్యక్షులు తమపరివారముతో కొలనుపాకకు చేరుకొనిరి పరిసరగ్రామాదు లరైతులు యితరులను స్థానికులను మూడువాల్గువందలవరకు ఏతెంచి ఆంధ్రమహాసభకార్యకర్తలతోకలిసికొనిరి. కొలనుపాక పౌరుల వైపునుండి మహాసభాధ్యక్షులకు వారిసహచరులకు సన్మానపత్రము యివ్వబడెను మహాసభాధ్యక్షులు స్వాగత పత్రమునకు ప్రత్యుత్తరమిచ్చుచు ప్రస్తుతెమెదుర్కొనుచున్న సమస్యలనన్నిటిని వివరముగా తెలిపిరి ఆంధ్రమహాసభ నిర్మాణకార్యక్రమము తెలుపుచు, దేశీయులునిర్మాణకార్యక్రమములోపట్టుదల, ఓపికతోపనిచేసి ఉన్న ఆశయములను సాధించుకొనుటకు అర్హతసంపాందించుకొనవలయునని సంబోధించిరి తర్వాత శ్రీయుత గంగరాజు రఘునాథరావుగారి కృతజ్ఞతతో కార్యక్రమము ముగిసెను. రాత్రి పండ్రెండుగంటలకుబయలుదేరి అధ్యక్షులవారు తమ సహచరులతో హైదరాబాదకుచేరుకొనిరి

... ...

## ఆంధ్రమహాసభ స్థాయిసంఘ ప్రకటన

హైదరాబాదు(దక్కన్), అబాన్ ౨

పట్టీసంఘములలో ఆంధ్రమహాసభానిర్మాణ కార్యక్రమమును నడిపించుటకు ఆర్గనైజర్లు(౧౦) కావలసియున్నారు ఆర్గనైజర్లవేతనముయోగ్యత సమర్థతలనుబట్టి రు౨౦ నుండి రు౨౫ వరకు యివ్వబడును. ఆర్గనైజరులవిధులు క్లుప్తముగ ఈ క్రింద నుదహరింపబడుచున్నవి.

౧ పట్టీలోచేరిన గ్రామాదులలో ప్రతిరోజు దౌరాచేసి గ్రామవాసుల కష్టములను తెలిసికొని వాటివిషయములో తగుచర్యతీసికొనుట.

౨ పట్టీసంఘ కేంద్రస్థానమున రాత్రివయోజనపాఠశాలను నడిపించుట

౩ ప్రభుత్వమువారి పాఠశాలలులేని గ్రామాదులలో స్థానికప్రముఖులను ప్రోత్సహించి వారి సహాయముతో బడి స్థాపించుట

౪ జనులలో దేశపరిస్థితులను తెలిసికొనుటకు వార్తాపత్రికలుచదువుటకు అభిలాష గలిగించుట (౫)ఆంధ్రోద్యమసంబంధమగు ఇతరనియమితకార్యములు చూచుకొనుట.

(౨౦)సంవత్సరములకు ఎక్కువవయసు కలిగినవారుగనుండి అభ్యర్థులుముల్కీలై కనీసము మెట్రికులేషన్ వరకు చదువుకొన్నవారై తెలుగు ఉర్దూలో సరిగ చదువను వ్రాయను మాటలాడగలవారైయుండవలయును అబాన్ (౧౫)వ తేదివరకు స్థాయిసంఘకార్యాలయమునకు దరఖాస్తులు పంపవలయును దరఖాస్తులు అంగీకరించబడినఅభ్యర్థులకు శిక్షణయివ్వబడును.

అభ్యర్థులందరు౨౬అబాన్‌నాడు (౩నుండి౬) గంటలవరకు కార్యాలయమునకు ఏతెంచిన వారి యోగ్యతలనుపరిశీలించి నియామకములు జరుపబడును.

చిక్కెపల్లి రామచంద్రరావు,
ఆంధ్రమహాసభ స్థాయిసంఘము } కార్యదర్శి
తుర్జాగూడెము మొజ్జంజాహి మార్కెటువద్ద హైదరాబాదు
..

## మెదకు జిల్లాలో ప్రచారము

(ప్రత్యేక ప్రతినిధి)
నందికంది

౨౪-౧౧-౪౯ వ రోజు మెదకుజిల్లా ఆంధ్రజనసంఘపు ౨వ వార్షికోత్సవము చేయువిషయ మాలోచించుటకుగాను ఏర్పడినసభ ముగించుకొని అసంఘకార్యకర్తలగు శ్రీయుతులు వెంకటేశ్వరగుప్త రామారెడ్డి వెంకటరాజేశ్వరశర్మ, కందిశ్రీనివాసరావుగారలు ప్రచారముచేయుటకు నందికందియను గ్రామమునకు వెళ్ళిరి ఇక్కడ ప్రభుత్వముతరఫున గ్రామసుధారక కార్యము జరుగుచున్నది ఒకటిరెండు బాటలు నిర్మింపబడినవి కాని జనుల విజ్ఞానాభివృద్ధికై ఏలాటిప్రచారం జరుగుటలేదట అతిథులకు శ్రీ శివరాంరెడ్డిగారి దివ్యాతిథ్యం జరిగినది వీరు ఉత్సాహవంతులైన యువకులు వీరియింటియందే చిన్నపుస్తకాలయము ప్రారంభించినారు

రాత్రి రామేశ్వరాలయంలో పురజనుల సమావేశం జరిగినది ఆంధ్రమహాసభ జనులకుచేయుచున్న అనుకూలములు ప్రభుత్వముచే మనకు కలుగుచున్న లాభములు ముందుకావలసిన అనుకూలములు, బాగాతువలని నష్టము మున్నగు విషయములు ముచ్చటింపబడెను శ్రీరాముల దేవాలయము బహు సుందరమైనదేకాక బహు పురాతనమైనది.

ఇచ్చట రెండుశాసనములుగలవు. ఈగ్రామమందు ఎక్కడచూచినను విగ్రహములు శిల్పనటకృత్యాలు ధరించిన ఎన్నియో విగ్రహములు దేవాలయముచుట్టు నిలబడియున్నవి. ఈశాసనములు పండితులు పరిశీలింతురుగాక.

సదాశివపేట

వీరు మరునాడు సాయంత్రము సదాశివపేట చేరిరి శ్రీవెంకటేశ్వరగుప్తగారిఆతిథ్యము లభించెను గుప్తగారికుటుంబమువిద్యాప్రియమైనది వీరితండ్రి తెలుగులోపండితులు పార్శి తెలుసును వారికుమారులు గుప్తగారు వీరినేతృత్వములోపుస్తకాలయముఒకసంవత్సరముక్రిందటఏర్పడినది. ఈకొద్దికాలంలోనే పన్నెండువందలకుపైగా పుస్తకములు సేకరింపబడినవి కృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయముతో పోటీచేయగలదనే అభిప్రాయము స్ఫురించినది అయితే ఈసంఖ్యాభివృద్ధికి తగినట్లు పాఠకుల సంఖ్య లేదనివిని పర్యటకులకు విషాదముకలిగినది ఇక్కడిజనసంఖ్య ౧౫౦౦౦ వైశ్యులయిండ్లు నూటికిపైగానున్నవట, ఒక మాధ్యమిక పాఠశాలకూడ కలదు ఇట్లుండికూడా పాఠకుల సంఖ్య తక్కువయుండుట శోచనీయము

రాత్రి రామమందిరమందు సుమారు౨౦౦జనులతో ఇష్టాగోష్ఠి సలుపబడెను, శరీరమునకు అన్నములేకపోతే ఎట్లు దుర్బలమగునో అట్లే సజ్జనసహవాసము, పుస్తకాధ్యయనము, లేకపోతే మనస్సు కల్మషముచెందుననియు అందుచేతనే రోజు గ్రంథాలయమునకు అత్యవసరమనియు ఒత్తిచెప్పబడెను. ఆంధ్రమహాసభ జనులకుచేయుచున్న అనుకూలములు, ప్రభుత్వముచేయుచున్న ఉపకారములు, వర్తకసంఘావసరము మున్నగువిషయములు ముచ్చటింపబడిన తర్వాత సభముగిసెను.

* * *

## స్థాయిసంఘ ప్రచారకుని సంచారము

(స్వ. వి.)

బీబీనగర్, అబాన్ ౨

ఈ భాద్రపదశు౨ మంగళవారమురోజు సాయంత్రం ఏడుగంటల లోకల్ బండియందు ఆంధ్రమహాసభ స్థాయిసంఘ ప్రచారకుడగు శ్రీయుత మంత్రిప్రగడ వెంకటేశ్వరరావుగారు వచ్చియుండిరి వారు బుధవారమురోజు ఉదయము ఇక్కడి కొందరియువకులనుకలసి సమావేశము జరుపబడుననికోరగా, ఈరోజు గ్రామములో జనులు చాలవరకులేరు, రేపు గణేశచవితికనుక అందరను ఉండగలరు అనిచెప్పిరి అరోజంతయు కొందరమందితో, ఇష్టాగోష్ఠిజరిగెను పగలుమూడుగంటలకు రావుగారు ఇక్కడిప్రజలచేత నడిపించబడుచున్న బాలికాపాఠశాలనుకూడ చూచిరి గణేశచవితి సాయంత్రము ౪గం॥లకు ఆంధ్రయువజనసంఘపక్షమున శివాలయములో సమావేశముజరిగెను సమావేశమునకు దాదాపుగ౫౦మందివరకు వచ్చియుండిరి. శ్రీయుతరావుగారు ఆంధ్రమహాసభోద్దేశ్యములు అస్పృశ్యత, మద్యపానము, బాల్యవివాహనిషేధము విద్య గ్రంథాలయములు మున్నగు విషయాలనుగూర్చిచెప్పుచు మాగ్రామములోయున్న గ్రంథాలయమును మూసివేయుట శోచనీయమనియు ఇంతమంది యువకులుండి ఒకగ్రంథాలయము నడుపకపోవుటచే విద్యాగంధములేని వారగుదురనియు, ఇప్పటికైనను గ్రంథాలయము తెరచి గ్రంథాలయ వార్షికోత్సవమునకు ప్రయత్నించిన తప్పక అనుమతి లభించుననియు రాత్రి ఎనిమిదిన్నరగంటలవరకు ఉపన్యసించిరి మధ్యన వాలంటీయవర్షముకురిసినను సభికులుమాత్రము సభవిడిచిపోలేదు రావుగారిఉపన్యాసము మధురముగా యున్నందున, మీరు రేపటిదినము ఇక్కడయుండి మరల ఉపన్యసించినయెడల కృతకృత్యులమగుదుమని జనులు వేడినందున లక్ష్మివారమురోజు ఉదయము ౧౦ గంటలకు ఉపన్యాసముచేసి నాలుగన్నరగంటల బస్సుకు ఘటకేశ్వరంపోయిరి.

## సనాతనుల వక్రగతులు

(గత సంచికతరువాయి)

అకు 'మూర్ఖత్వమే' గాదు 'జడత్వము'గూడ సాపాదించుట తప్పుగాదు.

ఇట్టివారుకేవలము అభివృద్ధిని నిరోధించువారిలో అగ్రగణ్యులు. పాతఎంతతోతరైయినను, ప్రస్తుత ప్రపంచమునకు అదిఎంతప్రమాదమును ఘటించుచున్నను దానినేపట్టుకొని వ్రేలాడుచుందురు. ఇటువంటి యీ 'నిజమైన జాతీయవాది'గారు ధర్మవిషయపరిశీలన తెలియనప్పుడు, తెలిసికొనుటకైన ప్రయత్నింపవలెను గాని, అనవసరప్రసంగములకు ఇకనైనను దిగకుందురుగాక!

ఇట్టిఅనవసరార్భాటములను హైద్రాబాదు సంస్థానమువారు జట్టుపెట్టగూడదు. బహుజనాభిప్రాయసమ్మతమును, దేశోపకారకరమును అయిన యీసంస్కారమును వెంటనే గావించుట వారివిధ్యుక్తధర్మము).

(గృహలక్ష్మి)

## చెరువుమరమ్మతు, రైతుల మొఱ

(ఒకవిలేఖరి)

తూతకలింగన్నపేట మధిరతాలూకా మెహరు ౩

ఈ గ్రామము మధిరతాలూకాలోచేరినది ఇచ్చట పూర్వమునుంచి ఒక చెరువువుంటుండెను అందాజ ౧౫౦ యకరములసేద్యము ఆవుతూవుండెను. ఈచెరువుకు ౧౪౦౦౦ రూప్యముల మరమ్మతు మంజూరి యీ ౧౩౪౯ ఫ కి యిచ్చియున్నారు, కంట్రాక్టరుగారు పనిఆరంభము చేయించి పాతకట్టపైన మట్టిగోడపెటినట్టుగా యెత్తుగాచేయించినారు. చూచుటకు యెత్తుగా వుండుటేకాని, నీరు పూర్వముకంటె ఎక్కువ ఆగేయేర్పాటులేదు. పాపము కంట్రాక్టరుగారు తమలాభమునే చూచుకొనిరిగాని రైతులసౌకర్యమును, ప్రభుత్వమువారిఉద్దేశ్యమును దృష్టియందువుంచరైరి.

ఈ సంవత్సరము-అశ్లేషమఘకార్తులలో గొప్పగొప్పవర్షములుపడి చెరువుఅలుగుపడెను. ఈ చెరువు పాతతూముగండిపడి ప్రవాహము పోసాగెను. నాటువేసినపొలములు పాడుఅవుచుండెను. కంట్రాక్టరుగారిని యిదియేమిఅన్యాయము యీగండిని అపుచేయించవలసినదని అడుగగా, బందుచేయించేబాధ్యతమాకులేదు. అవి మాచేతనైతులనుంచి ౫౦ రూపాయిలు వసూలుచేసి, మరల రైతులతోకూలీలతో అపుచేయించినారు. సర్కారువారు వేలరూప్యము లు యిచ్చినను, కంట్రాక్టరుగారు బీదరైతులనుంచి మంతము వసూలుచేసి మరమ్మతుచేయించుటయు చాలాఅన్యాయముగాయున్నది. ఇప్పటికిని పూడ గండిఆగేనమ్మకములేదు, సర్కారువారు చెరువు తనకీచేయించి తగుయేర్పాటుచేయించగ లరనిప్రార్థన.

## గణేశచతుర్థిలో పఠనాలయపునరుద్ధరణ

(ఒకవిలేఖరి)

గడ్డి అన్నవరం మెహరు ౩౧

గడ్డిఅన్నవరము నగరమునుండి సుమారు ౩ మైళ్ళదూరమునగలదు. ఇదిసర్ఫఖాసులో షర్కి-తాలూకాలోని గ్రామము.

ఇచ్చట "అన్నవరం రీడింగురూం" అనుపఠనాలయముండెను. కాని కొంతకాలమునుండి అది పనిచేయజాలకుండెను. అదియే యీవినాయకచవుతిరోజు పునరుద్ధరింపబడినది. శ్రీయుత లింగాలసత్త్యయ్యగారు ఒకసంవత్సరమువరకు గోలకొండపత్రిక తెప్పించి పఠనాలయాని కొసంగినారు, ఇంతియేగాక పఠనాలయమును నడుపుటకు తాత్కాలికంగా, ఉచితముగా తమతోటలోని చిన్నబంగులానుయొసంగినారు, శ్రీయుత తిరుళ్ళలక్ష్మయ్యగారు భక్తపత్రికయొసంగినారు తదితరఉదారమహానుభావులు, యువకులుచాలామంది మాసచందాలువేసి కొందరు తిమ్మనమేయొసంగినారు.

## ప్లేగు

మహిబూబునగరముజిల్లాలోని పర్గితాలూకా లాకాలో వెంకటేశ్వరరావుగ్రామంలోను లాతూరుతాలూకాలోని ధసేగాంలోను ప్లేగువ్యాధి ప్రారంభమైనది.

## మహబూబ్‌పాల గ్రంథాలయము

పెబ్బేరు(వనపర్తి సంస్థానము)విక్రమ(శ్రావణబగితె. మాగ్రంథాలయములో శ్రీవిక్రమ సం ర శ్రావణబ ౧-౫ లు శుక్రవారముపగలు సుమారు ౨ ఘంటలకు శ్రీమాన్ వేదమూర్తి పసపులకోవూరు భరతయ్యగారి అధ్యక్షతక్రింద శారదాచట్టమునుగురించి సమావేశముజరిగెను, సుమారు ౫౦ మందికిపైగా ప్రజలువచ్చియుండిరి. కొంతవరకు సహేతుకముగా చర్చించినపిమ్మట, అందరునుకూడ శారదాబట్టమును తొందరగా ప్రవేశపెట్టగ అందులకు శ్రీ మహాఘనత వహించిన నిజాముప్రభువరేణ్యులను స్తోత్రముచేయుచు సంతకములుచేసిరి

ఇట్లు
యమ్ బుచ్చారెడ్డి
ఉపాధ్యక్షులు

## నిజాంరాష్ట్ర గౌడ యువజనసంఘము

(ఒ.వి.) హైద్రాబాదు-దక్కన్,అబాన్ ౪

సర్వాగౌడు [నిజామాబాదు] గారి అధ్యక్షతన సెప్టంబరు-౨౧నాడు పైసంఘ వార్షికోత్సవము కాచిగూడెం తుల్జా భవనములో జరుగును.

## హరిజనసేవాసంఘ వార్షికోత్సవము

(ఒకవిలేఖరి) ఖమ్మంమెట్టు, సెప్టంబరు-౩

ది ౩౦-౮-౪౦ వ సాయంత్రం ౫౦ ౪-౩౦ లకు ఖమ్మంమెట్టు హరిజనసేవాసంఘ వార్షికోత్సవము రయ్యతు" పత్రికసంపాదకులును, హైదరాబాదు శాసనసభాసభ్యులును, మందుముల నరసింగరావుగారి అధ్యక్షతన శ్రీయుత సుగ్గల అత్యయలింగంగుప్తగారి కలపమండెలో వేయబడిన పందిరిలో జయప్రదముగా జరిగినది.

సభకు పండితనరేంద్రజీ శాస్త్రాసా, పండిత మన్నాలాల్‌మిశ్ర కేశవార్యశాస్త్రి, కాళోజి నారాయణరావు, హయగ్రీవాచార్యులుగార్లు విచ్చేసిరి. సభాస్థలమునకు ౧౦౦౦ (వేయి) మంది ప్రేక్షకులువిచ్చేసిరి.

శ్రీమాగంటికృష్ణమూర్తి, హరిజనబాలురప్రార్థనలతో సభప్రారంభమైనది. సంఘాధ్యక్షుండు పసుమర్తి వెంకటలక్ష్మయ్యగారి స్వాగతోపన్యాసము, అధ్యక్షుని ప్రారంభోపన్యాసముతర్వాత సంఘకార్యదర్శి మిట్టపల్లినరసింహంగారు నివేదికను నివేదించిరి.

పండితనరేంద్రజీ శాస్త్రాసాగారు ఉత్తేజకరముగ సుమారు అరగంటవరకు ఉపన్యసించిరి. పండితమిశ్ర గారుభజనరూపముగా ఉపన్యసించిరి.

కాళోజినారాయణరావు, హయగ్రీవాచారి అళ్వారుస్వామి, పాతూరి రామకోటయ్యగార్లు స్థానికప్రముఖులగు వేమునంటి రాంకిషన్‌రావు అయితంరాజు జేడికంటిరాంరావు, సుగ్గల అత్యయలింగంగుప్త, కొలిపాక వెంకటకిషన్‌రావుయింతియాజాఖాను మొదలగువారును ఉపన్యసించిరి

సభ రాత్రి ౮ గం ౮, ౩౦ లకు జయప్రదముగాముగిసినది.

జరిగినఉపన్యాసములలో సభాధ్యక్షుని ఉపన్యాసము నరేంద్రజీ,కాళోజీనారాయణరావు వేమునంటి రాంకిషన్‌రావుగార్ల ఉపన్యాసములు ప్రజలను మిక్కిలిఆకర్షించినవి.

మరుసటిదినం ౫౦ ౯ లకు ఎన్నికజరిగినవి, రాత్రియుష్ప్రెస్‌లో ప్రముఖులందరు తిరిగివెళ్ళిరి.

## గజాననోత్సవము

హైద్రాబాదు దక్కన్ అబాన్ ౩

గణేశచతుర్థి సెప్టంబరు౫తేదినుండి చాంద్రికాపూరు కబూతర్‌ఖానా కెప్టెన్ ఘనశ్యామభవనములో శ్రీ సమస్త జగదాధార సర్వసమాజమువారు గజాననోత్సవములు జరుపుచున్నారు.

అందులో జరిగిపోయిన కార్యక్రమముపోగా సెప్టంబరు ౧౨వతేది గురువారమురాత్రి ౯ గం.లకు సభ, అందు గోలకొండపత్రిక సంపాదకులగు శ్రీ సు. ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతలో రయ్యతుపత్రికా సంపాదకులగు నరసింగరావు గారు, కృష్ణమాచారిగారును ఉపన్యసింతురు మరునాడు శుక్రవారము పగలు ౨గంటలనుండి స్త్రీలసభ మా. మాణిక్యమ్మగారి అధ్యక్షతలోజరుగును. ౪గం.లనుండి మిసెస్ ఐర్కాత్ రాముజీగారి అధ్యక్షతలో హిందీ ఉపన్యాససభ జరుగును సెప్టంబరు ౧౪ శనివారము సాయంకాలము-౬గం లకు ముకుందదనదివరకు గణేశునిఊరేగింపుతో గొనిపోయి విసర్జింతురు.

జ్వరపు ఆహారముమీద విమర్శ

ప్రఖ్యాతివహించిన ఆహారపానీయము రోగనివారణకు తోడ్పడును.

జ్వరమువచ్చినపుడు, నిలచినతరువాత, ఎట్టి ఆహారమివ్వవలెనను సంశయము డాక్టర్లకు కొంత ప్రసంగము చేసిరి. రోగియొక్క కడుపు నిర్బలము గానుండుటచే ఘనఆహారము సహించదు. అయినను రోగముకుదురుటకు, అలసటను పోగొట్టుటకు ఆహారిఅత్యావశ్యకము.

ఈఅలసటకుకారణము జ్వరపువిషము దేహములో ప్రవేశించుటవల్లనని పరిశోధింపబడినది. శరీరపుష్టిగు హెచ్చుట, భరింపజాలనితలనొప్పి, వేడిమి, వెంటనేవణుకునంతటిచలి ఇవిఅన్నియు జ్వరపువిషము నరస్నాయువులలో ప్రవహించుటచేత అందువలన బలహీనత.

ఈనిర్బలమైన స్నాయువులకు త్వరలోతిరిగిబలముచేకూర్చుటఅత్యావశ్యకము బలహీనమైన జీర్ణకోశమునకు ఏదితగుమైనఆహారమో దానిని ఇవ్వవలసినది. ఇాత్వరలోజీర్ణించి మంచిసత్తువనిచ్చుఆహారము. ఇదిబలముచేకూర్చి, తేర్చుకాలము తగ్గించును. ఇందుచేత సాధారణముగా అన్ని ఆసపత్రులలో దీనినే జ్వరబాధితులకు ఇచ్చుఏర్పాటు చేసినారు.

# నైసర్గికపరిస్థితులవల్ల బ్రిటనుయొక్క అదృష్టము

## ఫ్రాన్సునుండి బ్రిటిషు సేనల తొలగించుటలో నేర్పు

## హిట్లరు బ్రిటిషువారి అదృష్టమును ప్రశంసించుట

బెర్లిన్, సెప్టెంబరు ౭

శీతకాలములో పేకలసహాయమునకై సాగింపబడుచుండు ఉపన్యాసమునకు హిట్లరుగారు నేడు ప్రారంభోత్సవ మొనర్చుచు ఇట్లుపన్యసించిరి:

"బ్రిటను, తనసైన్యములను అతిశీఘ్రముగా స్వదేశమునకు మరల్చుకొని పోగలుగుటవలనను, దాని నైసర్గికస్థితివలనను అదృష్టవశమున తప్పించుకొనగలిగినది. లేనిచో, జర్మనీయొక్క ఇతర ప్రతిపక్షులకు ఏగతిపట్టెనో అదే బ్రిటనుకు కూడ ఇదివరకేపట్టియుండెడిది, ఇప్పటికే అత్యంతవిశాలమైన భూభాగము జర్మనీ అధికారములోనికి వచ్చినది, ఇటాలీయును తూర్పుఆఫ్రికాలో శత్రువుపై సాగించుచున్న దాడులవలన, ఈ విధముగా విశాలమైనభూభాగమింకను హెచ్చినది.

ఇంతవరకు పశ్చిమదిక్కున జరిగినమహాయుద్ధములన్నిటిలోను, బ్రిటిషు మిత్రమండలివారు పరాజయములుతప్ప మరేమియులభింపలేదు ఇపుడు ఇతరులవలెనే ఫ్రాన్సుకూడా పూర్తిగా భగ్నమైనది. దీనికి బ్రిటిషువారేమనుచున్నారో చూచితిరా. ఇప్పటికి, బ్రిటిషువారు తమబలమునంతయు ఒక్కచోట కేంద్రీకరించుకొనుటకు అవకాశముగల్గినదనుచున్నారు. అట్లయినచో సరే ఇంగ్లండుకుయిపుడు, తానెంతో ఆశించుచున్న ట్టి అనుకూల పరిస్థితులు లభించినవి. ఇంతవరకు ఫ్రాన్సుకూడ వారిపక్షములో వుండుటవలన వారికినష్టమే గాని లాభముగలుగలేదు. ఫ్రాన్సుకై వారు అమూల్యమైనబ్రిటిషురక్తము నెంతో వెచ్చింపవలసివచ్చెను ఆభారమునుయిపుడు తప్పిపోయినదికనుక యికనేమిచేతురో చూడవలసియున్నది."

### జర్మనీ యుద్ధోద్దేశ్యము

ఇంగ్లాండులోనిప్రజలు కొందరు మీరింకను దండెత్తి వచ్చుటలేదేమిఅని జర్మనీని అడుగుచున్నారు వారికిమాజవాబుయిది "ఓపికపట్టవుండుడు. మేమువచ్చెదము" ప్రపంచమునంతయు బానిసతనమునుండి వదలించెదము, ప్రస్తుతస్థితిచూడుడు ఒకదేశము తనయిష్టమువచ్చినరీతిగా, ఒకఖండమునంతయు దిగ్బంధనగావించి, అచటిప్రజలకు ఏవిధమగు సరకులను అందకుండ చేయుచున్నది ఇట్టిఅసహ్యకరమగు పరిస్థితులను పూర్తిగా తొలగించివేయవలెను సముద్రపుబందిపోటు దొంగలదేశమొకటి తనయిష్టమువచ్చినప్పుడెల్ల ౭౦౦౦ లక్షల ప్రజలను, ఎప్పుడుపట్టిన అప్పుడు, దుర్భరమగుదారిద్ర్యమునకును క్షామానికిని గురిచేయుగల్గుట సాధ్యముకాకుండ చేయవలసియున్నది. ఒకానొకదేశములో అధికారములోవున్న ఏధనపతియో తలచుకొనినపుడెల్ల ౭౦౦౦ లక్షల ప్రజలకు శరీరక మానసికహింసలుకలిగించి శిక్షించుచుండుట, ఏమాత్రము సంహింపదగినదిగాదు,

ప్రతిపక్షులుఏమైన వివేకముతో ప్రవర్తింతురేమోఅని ఇన్నాళ్ళవరకు ఓర్పుతో తానుకాంచుచుండెనని ఇదివరకు గావించిన ప్రకటననుగురించి హిట్లరుగారు ప్రసంగించి పూర్తిగా అటో ఇటో తేలువరకు తానీయుద్ధమును సాగించి తీరెదనని శపథముచేసెను.

### రాత్రివిమానదాడులకు ప్రతిక్రియ

విమానదాడులనుగురించి హిట్లరుగారి ఇటులనుడిరి "పట్టపగలు జర్మనీపై దండెత్తివచ్చుటకు బ్రిటిషు విమానదళమునకు ధైర్యములేదు, అందుచేత రాత్రిపూటవిమానములను పంపిబాంబులు వేయించుచున్నారు బ్రిటిషు విమానము గ్రామములమీదను, సాగు భూములమీదను, ప్రజా నివాసములమీదను విచక్షణలేకుండా బాంబులు వేయుచున్నవి ఈపద్ధతినెప్పటికైన మానెదరేమోనను యుద్దేశ్యముతో నేను మూడు నెలలుగా జవాబుచెప్పకుండ వూరకొన్నను, ర్చిలుగారు ఇది జర్మనీయొక్క దుర్బలత్వమనచున్నారు అందుచేజర్మనులిపుడు ప్రతిరాత్రిగూడ బ్రిటనుకు జవాబునిచ్చుటప్రారంభించినారు, ఈరాత్రిబందిపోటుదారుల కృత్యములన్నియు ఆగిపోవునట్లుచేసెదము. ఈరెండు దేశములలో ఏదోయొకటి పూర్తిగాశిథిలమై పోవుసమయము వచ్చును. కానిశిథిలమై పోవలసివచ్చునది నేషనల్ సోషలిస్టు జర్మనీమాత్రముకాదని నేనుదృఢముగా చెప్పగలను. జర్మనీకి ప్రత్యర్థిగా ఇంకను నిలచివున్న గ్రేటుబ్రిటను, ఐరోపాఖండములోని చిట్టచివరి లంక తప్పక శిథిలమైపోవును.

### బ్రిటిషువారి ద్వేషమునకు కారణము

మనసంఘనిర్మాణ మూలసూత్రములుచూచి మనజాతీయ పునర్నిర్మాణ కార్యక్రమమునుచూచి, అదితమకు ఉపద్రవకరమని భావించి బ్రిటను జర్మనీని ద్వేషించుచున్నది ప్రపంచమంతయు ఇకమీద ఈవిధమగు నిర్మాణమునే అవలంబించునని వాద్యధవిశ్వాసము మార్పునుఅంగీకరించి, దానినవలంబింపనిజాతి నేడో రేపో భగ్నముగాకతప్పదు,

మేముఎట్టిపరిస్థితులకైనను సిద్ధముగా ఉన్నాము ఏక్షణమందైనను అవసరమగుచర్యదీసుకొనగలశక్తి, దృఢనిశ్చయముమాకు పూర్తిగానున్నది అన్నిటికంటే విశేషమేమనగా ఏదికూడమమ్ము భయపెట్టజాలదు దేనిని జూచియు బెదరము, జర్మను నేషనల్ సోషలిస్టులమగు మేముమానవులూహించుకొనదగు కష్టపరంపరలను అన్నిటిని అనుభవించి, వాటినుండి బయటపడవచ్చినాము అందుచే, మమ్మిక నేదియు ఆశ్చర్య పరుపజాలదు, బెదరించి అడ్డగింపజాలదు."

---

## వైద్యుల ఇష్టాగోష్ఠి

హైదరాబాదు (దక్కన్), అబాన్ ౪

౧౦ సెప్టెంబరు ౧౯౪౦ హైద్రాబాదులోని ఆయుర్వేద వైద్యులందరును సమావేశమై పరస్పరాభిప్రాయములదెలుసుకొనుటకును, ఉపన్యాసములద్వార పనులలో ప్రబోధముకలిగించుటకును, శేరూను అల్యాబాద శంకరుగంజు (ఆయుర్వేదౌషధకుటీరము) శ్రీశివశంకర్ రత్నంవైద్యుని యొక్క ఔషధాలయమందు సాయంత్రము ౬ ఘంటలకు సమావేశముచేసిరి. ఈసభకు శ్రీ పండిత గయాప్రసాద శాస్త్రిగారు అధ్యక్షులుగా నుండిరి.

---

## అమెరికా వ్యవహారములు

అమెరికావార్తలలో విశేష తెలియుటేమ. సర్ జార్జి పేష్అను బ్రిటిషు అర్థశాస్త్రవేత్త అమెరికాను యుద్ధములో దించుటకై అమెరికాకు వచ్చినాడని అమెరికాశాసనసభ్యుడు సెనేటులో ఆరోపణ తేబడినది. ఈవిషయమైఅమెరికా ప్రభుత్వ న్యాయశాఖవారు విచారణ జరిపించదలచిరి, అమెరికాలో బ్రిటిషు రాయబారియగు లోథియన్ ప్రభువు పేష్‌గారు అమెరికా విడిచి పోకున్నచో అమెరికా బ్రిటనులమైత్రికి కష్టముగునని సలహానిచ్చినారు.

అమెరికా అధ్యక్షుడగు రూజ్వెల్టుగారు సెప్టంబరు ౨వతేదిన "గ్రేట్ స్మోకీ మౌంటెన్స్" వద్ద ఒక తోటలో ఉపన్యసించుచు ప్రస్తుతయుద్ధము అమెరికాపైకూడ త్రోయబడగలదు కాబట్టి ఇప్పటినుండియే అమెరికనులు సర్వవిధముల సిద్ధపడియుండవలెననిరి

సెప్టంబరు ౧౬వతేదివాటికి రూజ్వెల్టుగారు ౬౦వేలమంది నేషనల్ గార్డులను పనిలోచేరుటకాజ్ఞాపించిరి అమెరికా దేశరక్షణ సన్నాహములను చేయు ఉపసంఘమువారు చురుకుగా పని జరిపించుచున్నారు.

---



### గమనిక

ఇదివరకు యిసామియా బజారులో యున్న మా బట్టలదుకాణము సుల్తాన్ బజారులో దిల్షాద్‌టాకీసు కెదురుగా త్వరలో మార్చబడును, గనుక మా ఖాతాదారులందరు గమనించగలవరని కోరుచున్నాము.

యన్. నర్సిములు,

కె. రాజయ్య

బట్టలవర్తకులు, హైదరాబాదు-దక్కన్

## సనాతనుల వక్రగతులు

(౨వ పేజీతరువాయి)

వయసా పంచవింశత్యా అష్టాదశ హాయనాం, సముద్వహేత్ కన్యాం... సాధారణ సంస్కృత జ్ఞానమున్న వారెవరికైనను యీశ్లోక మునకర్థము తెలియుట మిక్కిలి సులభముకాని శాస్త్రిగారు అసత్యప్రచారముచేయుచు ప్రజల నుమోసముచేయుచున్నారు. ఎంతచేసినను "సత్యమేవజయతే, నానృతం" యను శ్రుతిప్రమాణము వ్యర్థముకాదుగదా.

బి ౧-౩ శుక్రవారమునాడు ఉదయము గట్టు పైనుండి బయలుదేరి దాతర్ పల్లి జాగీరుమార్గంగా మర్యాలకు చేరితిమి. దాతర్ పల్లినుండి మర్యాల రెండుకోసులదూరములోయున్నది. దారిమాత్రము చాల అపాయకరముగాయున్నది. బండ్లు పోవుటకుదగినట్లుగాలేదు. యిందుకుతోడు యిక్కడ ఖుష్కీపొలములన్ని రాళ్ళభూములు. రైతులపొలములలో దున్నునపుడు మరియుగుంటకలు మున్నగునవిగొట్టునపుడు పెద్దపెద్దరాళ్ళన్నిటిని బాటమధ్యనవేసియున్నందున మరింత అయాసముగాయున్నది. ఈసారి పదునాంధ్ర మహాసభలోని తీర్మానప్రకారము ప్రభుత్వము వారు యేయేరి లోకల్బోర్డుకము అపూరితమ్య ఘరపరచినట్లయిన పల్లెటూరివాండ్లకు రాకపోకలలో మరియు తదితర కార్యములలో యెంతో సౌకర్యముకల్గునని యూహించుచున్నాము. యిట్లు తీర్మానమునుగూడ శాసనసభలో ప్రవేశపెట్టి తొందరగా అమలులోకిరాగలదని మాఆంధ్రనాయకులను గోరుచున్నాము.

ఇట్లు
వి. యస్. దీనబంధు

... ... ...

## బాల్యవివాహ నిషేధశాసనమును బలపరచుట

రాయరావుపేట, జమ్మికుంట భోగనరము చిన్నకర్లెటూళ్ళకుజలపై పయనించి ఆంధ్రమహాసభప్రచారకులు శ్రీమంత్రి ప్రగడ వేంకటేశ్వర్రావుగారు ఆగా శ్రావణబ ౧౩ లు రవివారము తోజన భోనగిరితాలూకా జమ్మికుంటకు దయచేసినారు. శ్రీ కొమ్మిడి తిమ్మారెడ్డిగారు తమస్వగృహమున వీరికి ఆతిథ్యసత్కారము లొనరించి నందులకు కడుప్రశంసనీయులు. మరునాడు సోమవారమునాడు మధ్యాహ్నము శ్రీకొమ్మిడి నాట్సింహారెడ్డి (కొండాపురము) గారి అధ్యక్షతన గ్రామప్రముఖులందరుకలసి గ్రామాంధ్ర జనసంఘమును పేర సోకసమావేశమునుజరిపిరి. శ్రీ వేంకటేశ్వరరావుగారు కొన్నికర్ణక ప్రబోధగీతములుపాడిరి. తదుపరి ఆంధ్రులవసేవలో, ఆంధ్రమహాసభ ముఖోద్దేశ్యములేమియో విపులముగా చెలిపిరి.

బాల్యవివాహ నిషేధశాసనమునకు ఏకగ్రీవాంగీకారము

మాయీరెండుగ్రామములలో సనాతనధర్మరక్షణకంకణబద్ధులు మరియు జన్మచే బ్రాహ్మణులను శ్రీగోరకట్లవిఠ్ఠయ్యగారును. వైశ్యప్రముఖులలో ముఖ్యులగు గంగిశెట్టి సింగయ్యగారు తప్ప తక్కిన చిన్నపెద్దలుమొత్తము (౪౦౦) మంది హరిజనులతోసహా బాల్యవివాహ నిషేధశాసనమును తొందరగా అమలులోపెట్టవలయునని ప్రభుత్వమువారిని ప్రార్థించుచు శాసనసభాధ్యక్షులవారికి తమతమ సంతకములన్నియు టపాద్వారాపంపించినారు.

భోగనరము

ఈగ్రామముజాగీరు. అత్రాఫుబల్దజిల్లా మేడిచల్ తాలూకాలోచేరినది ఇచ్చటకోక ఖాస్గీపాఠశాలకలదు. అధ్యాపకుడు ఒక క్రైస్తవయువకుడు బెంజమిన్ తరపున ౮ రూపాయీలు జాగీరుతరపున ౪ రూపాయిలు మొత్తము ౧౨రూపాయిలు వేతనములభించును.

ఇచ్చట ప్రజాహిత సంఘాన్నతికార్యములలో కడుశ్రద్ధతో పట్టుదలకలిగి పనిచేయుచుండువారిలో ముఖ్యులగువారు శ్రీరావి చెంద్రారెడ్డిగారు, రావి మల్లారెడ్డిగారు శ్రీసోమిరెడ్డిగారు, మరియు వైశ్యప్రముఖులలో శ్రీ తాటికొండ నాగభూషణము మున్నగువారు కడుప్రశంసనీయులు. సాయంత్రము సుమారు ౪ గంటలకు శ్రీ చంద్రారెడ్డిగారు మరియు సోమిరెడ్డిగారు ఆత్యుత్సాహముతో ఇల్లిల్లుదిరిగి రైతుముఖ్యులను మరియు తదితర గ్రామప్రజలనుపిలిచి శ్రీకొమ్మిడి వాసుదేవారెడ్డిగారి యధ్యక్షతన సోకసమావేశము జరిపిరి. సుమారు ౪౦౦ ల ప్రజలచే సభయలంకరింపబడెను. ఆంధ్రోద్యమప్రచారకులవారు కూడ ఇక్కడిప్రజలకందరికిమహాసభసంగతిసందర్భములుదానిఉద్దేశ్యములన్నియు తెలిపిరి. ఈదిగువతీర్మానములుఏకగ్రీవముగానామోదించబడినవి.

౧ గ్రామప్రజల మరియుముఖ్యముగా రైతుల సోకర్యార్థము సోక గ్రామాంధ్రజన సభస్థాపించవలెను.

౨ బ్రహ్మచర్యమును పాడుచేసి బలహీనులుగాచేయుచున్న బాల్యవివాహ దురాచారమును తుదముట్టించుటకు బాల్యవివాహనిషేధ శాసనమునుతప్పక అమలులో పెట్టవలయునని ప్రభుత్వమువారిని ప్రార్థించుటయైనది.

౩ మద్యపాన పిశాచముచే ప్రజలందరు దారిద్ర్యదేవతపాలగుచున్నారని యిప్పటినుండి యికముందెన్నడుకూడ మద్యపానమునకు ఎవ్వరుకూడ సురిగానుండుటకు సామాజికముగ కట్టుబాట్లుచేయవలెను.

పైనుదహరించిన తీర్మానములు పౌరులందరు ఏకగ్రీవముగా నామోదించిరి. బాల్యవివాహనిషేధమునకై ఉదుతబొల్లయ్యయను వైశ్యప్రముఖులదప్ప తక్కినగ్రామ వాసులందరు సంతకములుచేసినారు. ఈసంతకములుగూడ శాసనసభకంపబడినవి.

... ... ...

## దొంగసంతకాలు

జగిత్యాల, ఆబాన్ ౧

గొల్లపల్లికిచెందిన సనాతనధర్మోద్ధారకులగు శ్రీమాకరంగాచారిగారు మొదలగువారలు జగిత్యాలగ్రామానికి "ప్రౌఢావివాహము" బిల్లురద్దు చేయవలెనని ప్రభుత్వమునకు యిప్పుతాలపై సంతకములవిషయమై దయచేసి రెండుమూడు రోజులు గ్రామములలో పెద్దసాహుకార్లు, వకీళ్లు, ౧౦ తరగౌరవనీయపౌరులవద్దికెళ్లి తమ మొరలుచెప్పుకొని, సంతకములవిషయమై విశ్వప్రయత్నములుచేసినారు. కాని పైవారు వచ్చినవారికి బుద్ధిచెప్పి పంపించిరి. ఇందునుగురించి అయ్యగార్ల ప్రయత్నములుసాగనందున చివరిపరిదుగమద్దతు వద్దకవచ్చాయున్నదని కొద్దిగాప్రాతవచ్చినవారివద్దికి వెళ్లి, కొద్దిమందితో సంతకములు, వ్రేలిముద్రలు తీసుకొని కొన్ని దొంగసంతకములు, అనగా వక్కరితో రెండేసి మూడేసిపార్లు పెట్టించుకొనివెళ్ళినారు. ఇపుడు మనవిచేయునదేమనగా సర్కారువారు పైకారణములగురించి, పైఅయ్యగార్ల దుష్ప్రచారముచేసి సంతకములుతీసుకొన్నవి పోటుగానంగీకరింపకుందురుగాక!

ఇట్లు
బి. వెంకటరాజన్న
జగత్యాల యువజనసంఘ కార్యదర్శి.

... ... ...

## సిరిసిల్ల తాలూకాలో బాల్య వివాహ ప్రచారము

౨౦౦౦౦ సంతకములకు ౧౧౯ రూకల కట్నము గైకొనువారి రాక

సిరిసిల్ల, ఆబాన్ ౧

వారముతోజాల క్రితము ఈ గ్రామములోనికి నమిలికొండ రంగాచార్యులుగారు కొన్ని బాల్యవివాహఅంగీకార పత్రికలు తీసుకవచ్చి హామనుదాలయ పురాణశ్రవణమున, పురాణమునకు బదులు బాల్యవివాహాలార్థములబోధింపసాగిరి. కొందరువృద్ధులు అమాయకులచే సంతకములుగైకొనిరి. తెల్లవారిఇంటింటికితిరుగుచు చదువురాని ప్రజలనుమోసముచేసి వ్రేలిముద్రలు తీసుకొనిరి ఈసంగతి స్థానికయువకులకు తెలియగానేరంగాచారికలిసి సంభాషించిరి. గాని వారు యువకులను సంతృప్తిపరుచలేకపోయిరి. ఇదికల్ల కొండయ్యశ్రేష్ఠిగారిదుకాణంలో చర్చలతర్వాత తేలినదేమంటే ౨౦౦౦౦సంతకములుచేయించిన రంగాచార్యులగారికి ౧౧౯రూకలకట్నము దొరకునట! తెల్లవారి యువకులుసమావేశమై శ్రీవారిని పిలువపయుసనైరి: అనుగ్రహించి బాల్యవివాహనిషేధప్రచారకులు వచ్చుచేసిన, ఇంతకుమించి సంతకములుచేయింపగలమని మాకోరిక.

ఇట్లు
యస్. భూపతిరెడ్డి.

... ... ...

## బాల్య వివాహ నిషేధశాసనముపై సనాతనుల పరవళ్లు

హైదరాబాదు సంస్థానములో హిందువులయందుబాల్యవివాహములను నిషేధించు నిమిత్తమై త్వరలోయొక శాసనమురానున్నదియు, దానిపైవ్యతిరేకప్రచారమును గావించుచున్న సనాతనఛాందసులయలజడిని విస్మరించి, వెంటనేశాసనము గావించుట ప్రభుత్వధర్మమనియు గతమాసపు 'గృహలక్ష్మి' సంపాదకీయములో ప్రస్తావించియున్నాము

ఈవిషయమున హైదరాబాదు ఆంధ్రసోదరీమణులవద్దనుండి మాకార్యాలయమునకువచ్చుచున్న వివిధములైన వార్తలనుబట్టిచూడ, యీశాసనముపై సనాతనలు ఎంతనైచ్య ప్రచారమునకు పాల్పడుచుండిరో తెలియుటయేగాక, ఈశాసనమునుఎంతత్వరలోగావింపవలసియున్నదియు కూడ తేటపడుచున్నది.

అతిబాల్యవివాహముల జరుపుటకు ఏనాగరికజాతియుసమ్మతింపదు. అన్నెపున్నెము నెరుగని పసిబాలికలకు వివాహముల నొనరించుటయందున, యదినైతికముగా సంఘపతనమునకు ప్రోత్సాహిపదిక. ఇట్టియత్యాచారమును మానవత్వముగల ఏమానవుడును అమోదింపజాలడు.

ఈవిషయమునెత్తుకొని 'దివ్యవాణి' పత్రికలో (౧౫-౭-౪౦) "నిజమైన జాతీయవాది"గారు, "గృహలక్ష్మి పాశ్చాత్య స్త్రీల వ్యభిచారవృత్తిని పాతివ్రత్య ధర్మముక్రింద నెంచునదియు మూర్ఖత్వమునకు సనాతనలు పాత్రులన్నిరాసిన గృహలక్ష్మిని విదుషరో"నదియు గతమాసపు గృహలక్ష్మి సంపాదకీయవ్యాసముపై విమర్శించుచు ఏవేమియోవ్రాసినారు.

పాశ్చాత్యుల వ్యభిచారవృత్తినేగాదు, పాశ్చాత్య పద్ధతులనుగూడ 'గృహలక్ష్మి' ఎన్నడును ఆమోదింపదు, పాశ్చాత్యపద్ధతులయందు కరణమును నిర్మొగమాటముగ విమర్శించుట గృహలక్ష్మి లక్ష్యములలో నొకటియను విషయము సర్వజనవిదితము.

ఇట్టిదానిపై అనవసరక ప్రసంగమొనరించిన 'నేటిరకాయ' వంటిదీ "నిజమైన జాతీయవాది" గారిలో 'నిజమే' 'గాదు 'జాతీయత' కూడ లోపించుచున్నది. ఇట్టివత్తిడు సంస్కారమునకు సహకారమునిచ్చు పత్రికలమైనను, ప్రజలపైనను రాళ్లురువ్వ యిటువంటివారికి ప్రమాణ

[౧౨ పేజీచూడుడు]

